శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణేనమః.

రసికజన మనోరంజకంబగు

పుష్పబాణవిలాసంబను.

నీగ్రంథంబు

ఉభయభాషాభూషణుండును సకల సుకవి

నికరవిధేయుండునగు,

బిరుదరాజ శేషాద్రిరాజుచే రచింపఁబడి

యందుకుసరియైన మూలంబునందలి శ్లోకముల

తోడను నవతారికతోడను

సరసాగ్రేసరులగు

రాజాశ్రీవెలుగోటి, ముద్దుకృష్ణ యాచేంద్రబహద

ర్వారి యనుజ్ఞవలన

వెంకటగిరిలో

శ్రీకాశీవిశ్వనాథ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౮౯౩-వ సం॥ డిసంబరునెల.

శ్రీ.

తే, గీ॥ శ్రీల వెలుగొందు రాజగోపాలకృష్ణ ।
భూమివిభునకుఁ బ్రీతిగాఁ బుష్పబాణ ।
విలసనంబును దెనుఁగింపఁ గడఁగినాఁడ ।
రసికసుకవీంద్రులకుఁ జిత్తరంజకముగ ॥

20
1-1894




శ్రీ

శ్రీహయగ్రీవాయన[illegible]

# పుష్పబాణవిలాసము.

శ్లో॥ కుశలహాటకచేలతటిద్యుతః । ప్రమదదాయిగళస్వ
నగర్జితః । రుచిరనందకుమారకవారిదః । కిరతుమయ్యతు
లంతుకృపారసం.

శ్లో॥ శ్రీమద్గోపవధూస్వయంగ్రహపరిష్వంగేషుతుంగస్తన
వ్యామర్దాద్గళితేపిచందనరజస్యంగేనహాసౌరభం।
కశ్చిజ్జాగరజాతరాగనయనద్వంద్వఃప్రభాతశ్రియం
బిభ్రత్కామపివేణునాదరసికోజారాగ్రణీఃపాతువః॥

ఉ॥ లీలనుగోపికల్గవుఁగిలింపఁ దదుచ్చకుచాళితాఁకుబిం।
కాలనలందినట్టిసిరిగంధముజాలినసౌరభాంగుఁడై । క్రాలుచు

జాగరారుణిమకన్గవమీఁబ్రభాతసద్రుచిం । దాలిచివేణునాద
కలనం దగుజారుఁడు మిమ్ముఁబ్రోచుతన్.

తే॥ కృతికర్త యీగ్రంథాదియందుఁ గావ్యలక్షణాను
సారంబుగ శ్రీకృష్ణదేవరూపమంగళాకారవస్తునిర్దేశమును నా
శీఃప్రయోగంబునుఁగావించె. (౧)

శ్లో॥ భువనవిదితమాసీద్యచ్చరిత్రంవిచిత్రం
సహయువతిసహస్రైఃక్రీడతోనందసూనోః ।
తదఖిలమవలంబ్యస్వాదుశృంగారకావ్యం
రచయితుమనసోమేశారదాస్తుప్రసన్నా ॥

ఉ॥ ఎల్లజగంబులంజనుల కెంతయునబ్రముగాఁగఁబల్వు
రా । గొల్లపొలంతులంగలిసి కోడిక నాడినకృష్ణువృత్తిరం । జి
ల్లుచునిప్పుడీకృతిరచింపఁగఁబూనిననాకునబ్జభూ । వల్లభయైన
భారతి కృపామతితోడఁబ్రసన్నయయ్యెడిన్.

అ॥ ఈకవి తానొర్పంగడంగిన కబ్బంబు నిరంతరాయం
బుగఁబరిసమాప్తినొందించుట కుపకరణంబుగసర స్వతీప్రసా
దంబునుఁగోరె. (౨)

శ్లో॥ కాంతేదృష్టిపథంగతేనయనయో రాసీద్వికాసోమహాన్
ప్రాప్తేనిర్జనమాలయంపులకితా జాతాతనుస్సుభ్రువః
వక్షోజగ్రహణోత్సుకేసమభవ త్సర్వాంగకంపోదయః
కంఠాలింగనతత్పరేవిగళితా నీవీదృఢాపిస్వయం॥

ఉ॥ కాంతుఁడుగానరాఁబెనువి కాసముగల్గెనుగన్నుదో
యికే। కాంతగృహంబుఁజేరఁబులకల్జనియించెను మేననెల్లఁ
జ। న్నంతులువట్టఁగాఁదలఁచి నన్వడఁకప్పెను గౌఁగిలింపనా।
వంతదలంపనీవిదృఢమయ్యుఁ దనంతనెజారెనారికిన్.

అ॥ ఇందు నాయికా నాయకులు పరస్పర యోగంబునకుఁ జిరకాలంబు మోహంబుచేబరితపించుచు నొకానొకసమయంబున నిరువురకు నేకాంతస్థలంబుదటస్థించిన దర్శనసామీప్యస్పర్శనోద్యోగాదులచేఁ గలిగిన వారిచేష్టలు వర్ణింపఁబడియె. (3)

శ్లో॥ మాందూరాదరవిందసుందరదర స్మేరాననాసంప్రతి
ద్రాగుత్తుంగఘనస్తనాంగణగళచ్చారూత్తరీయాంచలా।

ప్రత్యాసన్నజనప్రతారణపరా పాణిం ప్రసార్యాంతికే
నేత్రాంతస్యచిరంకురంగనయనా సాకూతమాలోకతే ॥

ఉ॥ అంగన కప్పులన్ని లిచి యాస్యమునం జిఱునవ్వుగ్రాలను । తుంగకుచద్వయంబుపయి దువ్వలువించుక జారుచుండఁగాఁ । జెంగిటివారినంచనముఁ జేయుచుఁగంటికడన్ గరంబుఁజే । రంగదియించి నన్ను సుచిరమ్ముగఁ జూచెడిఁ గోర్కి రాజిలన్.

అ॥ ఇందొక ప్రౌఢయగు పరకీయ దానికిఁగల ప్రేమనంగచేష్టితములచేఁ దనకుఁ దెలిపి మఱులుకొల్పనని నాయకుండనుఁగు చెలికానికిఁ జెప్పినరీతి వర్ణితంబయ్యె. (౪)

శ్లో॥ నీరంధ్రమేతదవలోకయమాధవీనాం
మధ్యే నికుంజసదనం చ్యుతపుష్పకీర్ణం ।
కుర్య్వర్యదీహమణితాని విలాసవత్యో
బోద్ధుం నశక్యమబలే నినదైః పికానాం ॥

ఉ॥ చేలరొచూడుబండిగురు విందలకుంజము నందుఁబుష్పము । లామిలమనోహరంబగు మరాజిలునీ విజనస్థలంబునం ।

బోలఁగఁగామినుల్లసిత ముల్లచియింప నెఱుంగ నెవ్వరుం ।
జాలరు గండుకోయిలలుసారెకునూరక కూయుచుండుటన్.

అ॥ ఇందొక యారామ సంకేతంబునఁ బుష్పాపచయ వ్యాజంబున మెలంగు నాయికకు క్రీడించుటకనుకూలంబగు మరుగుచోటునగపడమిచు తామచ్చట స్వైరతంత్రంబులొనర్చుట యొరు లెఱుంగుదురోయని దానిమనఁబుననుండు శంక దొలంగింప నాయకుం డాడిన విధంబభివర్ణితంబయ్యె. (౫)

శ్లో॥ దష్టంబింబధియాధరాగ్రమరుణం పర్యాకులో ధావనా
ద్ధమ్మిల్లస్తిలకంశ్రమాంబుగళితం ఛిన్నా తనుఃకంటకైః।
ఆఃకర్ణజ్వరకారికంకణఝణత్కారం కరాధూనవతీ
కింభ్రామ్యస్యటవీశుకాయకుసుమాన్యేషాననాన్దాగ్రహీత్॥

చ॥ కెరలెడుబింబ మంచుగొఱికె కెఱజిగిమోవిని గొప్పువీడెబ । ల్పరుగునబొట్టుచెమ్మటఁగలంగుచుజారెను మేనుముండ్లచేఁ । బరియలువాసెనోసిచెవి వ్రయ్యఁగగాజులుమ్రోఁగఁజిల్కకై । తిరిగెదవేల పుష్పవిత తిన్గ్రహియించెన నాండయీ వసిన్.

అ॥ ఇందొక నాయిక చెలికత్తెలతోఁ బుష్పములు గోయుటకై యుపవనంబుసొచ్చి మంచిపూదీవెలుపరికించు నపదేశంబున చెలిమిచేడియలమొఱంగి దూతికతోడ నొక జారనాయక సంకేతంబుఁ జేరియందాతనితోడ రతిసమ్మర్దనసుఖంబులనుభవించుతఱినచ్చటచ్చటపూవులుండుతావులరయుచు క్రమక్రమంబుగ నటకుంజేరిన దాని యాఁడుబిడ్డంగాంచి సంకేతంబున రతిసుఖవర్తినియగు నాయికకాడు బిడ్డరాక యెఱుకపడుటకును తదనంతరసమయంబున నాయిక మేనఁదోఁచుజారపురుషరచిత దంతనఖక్షతాదులగు చిన్నెలు వనంబున గ్రుమ్మరుటవలనఁ గలిగినవని యాయాఁడుబిడ్డకు దోఁచుటకునుసమయోచితంబుగ గావలిదూతిక పలికిన తెఱంగునుగవివర్ణించె()

శ్లో॥ బిభ్రాణాకరపల్లవేనకబరీమేకేనపర్యాకులా
మన్యేన స్తనమండలేనిదధతీస్రస్తందుకులాంచలం।
ఏషాచందనలేశలాంఛితతనుస్తాంబూలరక్తాధరా
నిర్యాతిప్రియమందిరాద్రతిపతేస్సాక్షాజ్జయశ్రీరివ ॥

చ॥ చెదరినకేశపాశమొక చేతభరింపుచునొక్క చేతనా।

నదవులజారుపయ్యెద స్తనంబులఁ జేర్చుచు వీటి కారుణం । బొద
వినమోవితోఁ జిటిలి యూడెడిగంధపుపూత మేనితో । నిదెయొ
కబోటిమారువిజయేందిరనాఁ బ్రియునిల్లు వెల్వడెన్.

అ ॥ ఇందొక నాయిక తన నాయకునితో రేయంతయుఁ దనివిదీర మదనతంత్రంబులనుభవించి యుషఃకాలంబున విటు నింటనుండి వెలువడిరాఁగా దానింజూచి తదంగంబులఁ దోఁచు రతాంత లక్షణంబులను చేష్టలను గొనియాడుచు నొక జారపురుషుఁడు మఱియొక జారునితో నుడివినవదు వృగ్గడింపంబడియె. (౭)

శ్లో॥ కాంతోయాస్యతిదూరదేశమితిమేచింతాపరంజాయతే
లోకానందకరోపిహిచంద్రవదనేనైరాయతేచంద్రమాః।
కించాయంవితనోతికోకిలకలాలాపోవిలాపోదయం
ప్రాణానేవహరంతిహంతనితరామారామమందానిలాః॥

చ॥ పతిపరదేశమేగునని వంతజనించెడునిప్పుడాజగ । ద్ధితుఁడగుచందరుండుకడు ద్వేషముఁబూనెడుఁ గోకిలధ్వను ।

ల్చుటురతఁ బాపినాకతివి లాపమొనర్చెడు నిష్కుటానిల । ప్ర
తతులె సౌమ్యతన్విడిచి ప్రాణముల న్హరియించెడుం జెలీ.

అ ॥ ఇందొక నాయిక తనప్రియుం డొకయక్కఱతో పర దేశయాత్ర సేయ సమకట్టి వెడలెంగ మనంబునందు మిగులఁ జింతించి తనచెలికత్తియతో నాయకుఁ డెడ యైనచో భవిష్యత్కాలంబునఁ దనకుం గలుగఁబోవు దురవస్థలం గూర్చి ముందర వచించిన చందంబునుడువంబడియె. (౮)

శ్లో॥ నవకిసలయతల్పం కల్పితం తాపశాంత్యై
కరసరసిజసంగాత్ క్లాపయంత్యాః ।
కుసుమశరకృశానుప్రాపితాంగారతాయా
శ్శివశివపరితాపం కోపదేతో క్షమలాంగ్యాః ॥

చ॥ నవముగఁదాపశాంతికినొనర్చినపల్లవశయ్యమీఁదఁగే ।
ల్వఁగదియించిదానినతి గాఢముగాఁగమలించుచున్ననో । భవశిఖిఁగ్రాఁగినిప్పయిన భామినిభూరిశరీరతాపముఁ । శివశివ యెవ్వఁడిట్టిదని చెప్పఁగనేర్చునుముజ్జగంబులన్.

అ॥ ఇందు మనోహరుండగు నాయకుఁడు తడవుగఁ దన్నుఁ జేరరాకుంటచేఁ బలువలకాఁకలం గలంగుచుండు నాయిక యవస్థనుఁగూర్చి దాని బోటికత్తియ యొక్కతె మఱియొక్కతుకతో వర్ణించినపద్యంబునిగదితంబయ్యె. (౯)

శ్లో॥ శేతే శీతకరోంబుజేకువలయద్వంద్వాద్వినిర్గచ్ఛతి
స్వచ్ఛామౌక్తికసంహతిర్ఘనవళీమా హైమీంలతాముంచతి
స్వర్భాత్పంకజకోశయోరభినవాయాంతిప్రజఃక్లాంతతా
మేషాత్వాంతపరంపరామమసఖేయాత్రాస్యహాంకర్మంతతి॥

ఉ॥ తమ్మిఁబసుంజెజుఁదురుఁడు తా రసమూహము పుట్టెఁ గల్వలం। దిమ్మగుహేమవల్లిఁ వెలువెల్లడ వించెనుబంకిజాతకోశ। శస్తులఁదాఁకిపాల్యములు గ్రక్కనుపల్లవ పత్త్రయిట్టిదా। కుక్కస్మడి నాప్రయాణమున కోర్వక విఘ్నముఁ జేసె నెచ్చెలీ.

అ॥ ఇంపుఁ దోలుత ప్రయాణనిశ్చయంబుఁ గావించి తనచెలికానికిం జెప్పియుండి తత్కాలంబు కడచినవెనుక మగుడంగనుపడ్డ నాసంగడికాఁడు ప్రయాణంబేల విరమించితని

యడుగ మన్నాయికాసందర్శనకాలంబునఁ దానికిట్టిదుర్దశా
లుకలుగుటవలననే వెలువడనైతినని నాయకుఁడుజెప్పె.(౧౦)

శ్లో॥దూతీదంనయనోత్పలద్వయమహో తాంతంనితాంతంతవ
స్వేదాంభఃకణికాలలాటఫలకేముక్తాశ్రియంబిభ్రతి।
నిశ్వాసాఃప్రచురీభవంతినితరాం హాహాంతచంద్రాతపే
యాతాయాతావశాద్వృథామమకృతేశ్రాంతాసికాన్తాకృతే॥

చ॥ ఉరువుఁగవాడెనీదునయనోత్పలయుగ్మము ఫాలవీధి
కం। బొరసినస్వేదబిందువది ముత్తెపుకాంతినిఁ బూనెనూరు
పు। ల్పరఁగెడుమిక్కుటంబుఁగను బాయకవెన్నెలలోన సా
రెసుం। దరినెఱదూతి నాకయివృథాశ్రమమందితె రాకపో
కలన్.

అ॥ ఇందొకనాయికపంపఁగా నాయకుని వెంటఁబెట్టు
కొని రానరిగి యతనితో సురత తంత్రంబుల సుఖించి వచ్చి
యతని యనాగమనహేతువును గపటంబుగ నెఱుకపఱచిన
దూతింబరికించి దానియంగంబునందలి రతిశ్రమవలని గురు
తులుగనుంగొని యీతాపికత్తియపోయిన కార్యఫలంబును

తానే యనుభవించివచ్చినదని నాయికమనంబునకుం దోఁపఁగా నదియగ్గలంబగునేవజనించియు దానిని బయలుపఱచకుండ గుప్తగోపయయి యాకుంటెనకత్తియతో హితోపలాలనావాక్యంబులు వలికినవిధంబున తాఁకనాడుట యుగ్గడింపఁబడియె. (౧౧)

శ్లో॥ అధివసతివసంతేమత్తకామాదురంతే
నవకిసలయతల్పంపుంజితాంగారకల్పం।
విరహమసహమానాచక్రవాకీసమానా
చకితవనకురంగీలోచనాకోమలాంగీ॥

చ॥ సరగవియోగమోరువక జక్కవముద్దియ కుద్దియైవనో। ర్వరిబాగహోందియున్నమృగి భంగినిజూచెడి కోమలాంగితాఁ। బరఁగువసంతకాలమునఁబ్రాణములన్విడనిప్పుప్రోవుతో। సరియగుచున్న క్రొన్ననల శయ్యపయి న్వసియించెనచ్చెలీ.

అ॥ ఇందొకనాయిక విరహిజనమానస మదనమాయాసంతమసంబగు వసంతసమయంబున నాపరాని విరహతాపం

బునోరుపంజాలక పరితపించుచు నుపేన విభ్రమావస్థలం జెంది పదియవయవస్థ ప్రాపింపం గమకించుచున్నం జూచి దాని చెలికత్తియ మఱియొక సకియతో శోకావేశంబునం బలుకు విధంబు చెప్పంబడియె. (౧౨)

శ్లో॥ నైష్ఠుర్యం కలకంఠకోమలగిరాం పూర్ణేన్దుశీతద్యుతే
స్తిగ్మత్వం బత దక్షిణస్య మరుతో దాక్షిణ్యహానిశ్చ తాం ।
స్మర్తుం వ్యాకృతిమేవ కర్తుమబలాం సన్నాహమాపాదితే
తద్విఘ్నః క్రియతే తృణాదిచలనోద్భూతైః స్వదాస్తిభ్రమైః॥

ఉ॥ పైకరవంబు నిష్ఠురత పార్వణచంద్రుని తీక్ష్ణభావముం । బ్రాకటపక్షిణానిలు కృపారహితత్వము దానిప్రాణము । లోర్వక డంబ్బట్టు సన్నహన ముంబచరించుఁ దృణాదికంపము। ల్చేకురనీవు వత్తువని చేడియ జీవముఁ దాల్చె నీయెడన్.

అ॥ ఇందు నాయకాగమన కాలయాపనమును సైపలేని నాయికవలన నియమింపఁబడిన దూతిక నాయకుని చెంతకుం జని యతనితోఁ బ్రియయొక్క తాత్కాలికావస్థనుఁ గూర్చి చెప్పినవిధంబు పలుకంబడియె. (౧౩)

శ్లో॥ సాప్రేమాంకురలోచనే విగళతి న్యస్తం శిలాకాంచనం
తీవ్రం నిశ్వసితం నివర్తయ నవాన్తాప్యంతికం త్వంస్రజః ।
తల్పే మాలతి కోమలాంగి తనుతాం పాంథాం గతా గోష్ఠ తే
నాతీతోదయితో పయానసమయో మా పూర్వన్యథా మన్యథాః ॥

ఉ॥ కన్నుల నీరు నించకుము కాటుక జాఱును పేఁడియూర్పులం। బన్నకు నిల్పుమీ కుసుమ మాల్యము లెల్లను వాడిపోవునీ। వెన్నఁగ శయ్యపైఁ బొరలె దేటికి గంధపు పూతరాలునీ। వన్నెమగండు రాఁగలఁడు పైఁడలివేఱుగ నెంచఁబోకుమీ.

అ॥ ఇందొక నాయిక తన నాయకునకు మిగుల నుల్లాసంబుఁ గల్పించుటకుఁ జక్కఁగ నలంకరించుకొని శయ్యామందిరంబుఁ జేరి నాయకుని రాక కెదురుచూచుచుండఁగా నాతని యాగమనంబునకుఁ గాలవిలంబమగుచో నిఁక రాఁడని నిశ్చయించి వగలఁబొగులుచున్న నాయికను జెలికత్తియ యూఱడించి పలుకువిధంబు నుడువంబడియె. (౧౮)

శ్లో॥ కాచిత్సర్వజనీనవిభ్రమపరా మధ్యే సభమండలం
లోలాక్షీ భ్రువసంజ్ఞయా వినతిమా త్యాసహభాషణం ।

అక్ష్ణోరంజనమంజసా శశిముఖీ విన్యస్య వక్షోజయో
స్థూలంభావుకయోస్థితం మణిసరం చేలాంచలేనావృథాత్ ॥

చ॥ చెలియలమ్రూకమధ్యమునఁ జేరినచేడియ నేర్పుమీ
ఱఁగఁ | చలముగుకంటిసన్నబొమ సన్నలదూతికఁ బల్కరిం
చుచున్ । గలయఁగఁగన్నుదోయివడిఁ గాటుకనించి కుచద్వ
యంబుపై । వెలిగెడురత్నహారమును వేగమెకప్పెఁబయంట
కొంగునన్.

అ॥ ఇందొకప్రౌఢయగు జారినాయిక చెలికత్తియల న
డుమనుండుసమయంబున తనసమాగమంబున కనువగుసమ
యంబరసిరమ్మని విటనాయకుండంపిన దూతిక రాఁగాఁ దోడి
చేడియలకెఱుకపడకుండ దానితో నాతని రాక కుచితంబగు
వేళను గనుసన్నలచేతను చేష్టలచేతను దెలుపుచు జరపు
ప్రసంగచాతుర్యంబు నిగదితంబయ్యె. (౧౫)

శ్లో॥ జిఘ్రత్యాననమిందుకాంతిరధరం బింబప్రభా చుంబతి
స్ప్రష్టుం వాంఛతి చారుపద్మముకుళచ్ఛాయావిశేషస్తనౌ
ఉక్తేః కోకనదస్య శైలటికరావాలంబ్య కించాదరా
దేతస్యాస్సుదృశః కరోతి పదయోస్సేవాం ప్రవాళద్యుతిః ॥

చ॥ వదనముమూర్కొనున్విధునివన్నియబింబముడాలుము
ద్దిడు। స్వేదవిఁజనుల్స్పృశించునళినీముకుళోజ్వలభావిశేషముల్ ।
గుదురుగఁగేలుపట్టికొని కోకనదప్రభయాడుచుండునీ । సుదతి
కిఁబాదసేవనము సొంపుగఁజేయుఁబ్రవాళకాంతియుల్ ॥

అ॥ ఇందొక యెలజవ్వనియగు కామిని మేనిచక్కఁద
నంబునుఁగని దానిపై మెండగు వలపు సందడింపఁగాఁ దన
మోహంబును మనంబుననిలుపఁజాలక యొకసరసుఁడు నిజస
ఖునితో చమత్కారంబుగఁ దానిసొబగును వర్ణించిచెప్పిన
విధంబు పలుకంబడియె. (౧౭)

శ్లో॥ దూతిత్వయాకృతమహోనిఖిలంమదుక్తం
నత్వాదృశీపరహితప్రవణాస్తిలోకే ।
శ్రాంతాసిహంతమృదుళాంగిగతామదర్థం
సిద్ధ్యంతికుత్రసుకృతానివినాశ్రమేణ ॥

ఉ॥ చెప్పినకార్యమంతయును జేసితిదూతిరొలేదు ధాత్రి
లో । మెప్పుగలాతివారలకు మేలొనరింపఁగనీసమానవీ । వి

ష్పాదుమన్నిమిత్తముగ నేగికడున్వెతలందితమ్మయో। యొప్పా॰ 
॰కుప్పకష్టముల కోరువకుండినఁబుణ్యమబ్బునే.

ఉ॥ ఇందొక నాయిక తననాయకుండు పొలయల్కచే మనంబునఁగోపించి తనకడకురాకున్న నాతనినూఱడించిరమ్మని దూతికఁ బంచిన నది పోయి తన చక్కఁదనంబుచేతను నేర్పుచేతను నాయకునిఁగైవసంబుచేసికొని తనివిదీర మరుకేళిఁ గూడివచ్చి నీసందేశంబు నెఱవేర్చివచ్చితినని బొంకి పలుకఁగా దాని యప్పటియునికింగాంచి దాని యొక్క స్వప్రయోజన నిర్వాహకత్వంబు నెఱింగి మనంబున నంకురించు రోషంబునుఁగప్పికొని దూతింగొనియాడువిధంబున గహించు నాయిక వాక్యమత్కారంబు వర్ణితంబయ్యె. (౧౭)

శ్లో॥నబరీభరీతిక బరీభ రేస్రజో నచరీకరీతిమృగనాభిచిత్రకం।
విజరీహరీతినపు రేవమత్పుగో విపరీవరీతినచవిప్రియంప్రియా॥

ఉ॥ క్రొమ్ముడియందుఁబూసరులు గూరుపదిప్రియ నేఁడిదేమితా। నెమ్మొగ మందుఁగస్తురిని నీటుగ బొట్టిడదేమివే

ఙ్కు౯బూ । ర్ణమ్మునుబోలెనాయెదుటరాగిలియాడదిదేమినా
దుపై । నిమ్మహిమంతువున్నవచియింపదదేమిమదేభగామినీ.

అ॥ ఇందొకనాయిక తనకడకునాయకుండురాఁగాఁ జెలి
కత్తియలాతనిపై నేరములు వెట్టియుండుటచేఁ గోపోద్దీపనం
బు మనంబునఁబెనఁగొనఁగా నలంకార వివర్జితయై యాద
రింపమిఁగని చింతాకులుండై దానితోడి చేడియలయం దొ
క్కతుకతో నానాయకుండువలికినవిధంబువర్ణింపంబడియె ()

శ్లో॥ గూఢాలింగనగండచుంబనకుచస్పర్శాదిలీలాయితం
సర్వంవిస్మృతమేవవిస్మృతవతో బాలేఖలేభ్యోభయాత్।
సల్లాపో స్త్వధునాసుదుర్ఘటతమ స్తత్రాపినాతివ్యథా
యత్త్వద్దర్శనమప్యభూదసులభం తేనైవదూయేభృశం ॥

చ॥ ఖలజనభీతిగూఢముగఁ గాఁగిటఁజేర్చుటగండచుంబ
నం । బులుఁగుచ మర్దనంబులను పుణ్యము విస్మృతమయ్యె
నొండొరుల । బొలుపుగ మాటలాడుటయుఁ బోయెనయైన

ను నేనుచింతిల । న్గలికిరొ నీదుదర్శనమె కామికనేఁ డెదలో ॰
నగుం దెరఁ.

అ॥ ఇందు రూపరేఖావిలాసాదులచేఁ దమిబుట్టించియూ
లింగనాదులకు లోఁబరచి కొంతకాలంబు గూఢంబుగ రమి
యింపఁ దాని నెఱింగినఖులురుపలువురాకాంతను నిందింపు
చుండ సంభోగంబుమాని యువలసమయంబబ్బినతఱి మనో
రథసూచకంబులగు చతురభాషణంబులఁదనివినొందుచుండనా
మేలునకుచూపోపక యేవగొనువారివలనిభయంబునసరస
ల్లాపాదులంద్యజించి నేత్రానందంబుగ నొండొరుఁ జూచికొ
నుటయుం గూడ మానుకొనియుండఁగాఁ గొంతకాలంబునన
దైవికంబున నొకదివసంబున నొకరహస్యస్థలంబున తటాలు
న నెదురుపడిన జారిణింజూచి జారనాయకుఁడు ఖేదాకులుఁ
డై పలికినవిధంబు వర్ణింపఁబడియె. (౧౯)

శ్లో॥ యాచంద్రస్యకళంకినో జనయతిస్మేరాననేనత్రపాం
వాచామందిరకీరసుందరగిరో యా సర్వదానిందతి।

నిశ్వాసేనతిరస్కరోతికమలా మోదాన్వితాన్యానిలాన్
సా త్రైరేవరహస్త్వయావిరహితా కాంచిద్దశాంనీయతే॥

చ॥ నలుపెదఁదాల్చుజాబిలికి నవ్వుమొగంబున సిగ్గుగొల్పుచున్। బలుకులచేత గేహశుకభాషలమాటికి నీసడించుచున్। జలరుహసౌరభానిలుని శ్వాసమునం బొరిధిక్కరించునా। నెలఁతకు నీవురామినవె నేఁడొకదుర్దశఁ గూర్చెన్ నీసునన్.

అ॥ ఇందొక నాయిక నాయకుం డెక్కారణంబుననో యొకరేయి తనయింటికిరా మసలినయంతమాత్రమునకే వియోగసంతాపంబు నోరువంజాలక తనదూతిక నతని పాలికింబంపఁగా నదిపోయిచేరి నాయకునితోఁ బలికిన చందంబు వర్ణింపఁబడియె. (౨౦)

శ్లో॥ తన్వీపాయదిగాయతిశ్రుతికటుర్వీణాధ్వనిర్గాయతే
యద్యావిష్కురుతేస్మితానిమలినైవాలక్ష్యతేచంద్రికా।

ఆస్తేమ్లానమివోత్పలంనవమపి స్యాచ్చేత్పురోనేత్రయో
స్తస్యాశ్శీరవలోక్యతేయదితటిద్వల్లీవివర్ణైవసా॥

చ॥ వనితయొకింతపాడిన విపంచిరవంబువినంగఠోరమై।
చనునిసుమంత నవ్వనెడఁ జంద్రికయున్మలినంబె నైతగున్।
గనుఁగవమ్రోల గ్రొందొగయుఁ గ్లాంతినిఁజెందిన జాడదోఁ
చుఁద। త్తనురుచిఁజూచుచో మెఱుపు తద్దవివర్ణమయ్యెక
నంబడున్.

అ॥ ఇందొకకాముకుం డొకానొక సుందరింజూచి దాని
పై మోహవిభ్రాంతికలవాఁడై దానిరూపవిలాస కళావైశ
ద్యంబులను తనప్రియసఖునితో నుడివిన విధంబు వర్ణింపం
బడియె. (౨౧)

శ్లో॥ సత్యంతద్యదవోచథామమమహాన్ రాగస్త్వదీయా...
త్వంప్రాప్తోసివిభాతఏవసదనంమాంద్రష్టుకామోయతః।
రాగంకించభిభర్షినాథహృదయేకాశ్మీరపత్రోదితం

నేత్రేజాగరజంలలాటఫలకేలాక్షారసాపాదితం॥

చ॥ రమణనిజంబునీకుఁగల రాగముకంటెను నాదురాగ
మే। సమధికమన్నదీవిపుడు షస్పుమయంబున నిందురాఁగఁ
గుం। కుమరసరాగమీయెడనుగుంభితజాగరరాగముద్రలన్।
క్రమముననీయలక్తకృత రాగముఫాలమునందుఁ దాల్చెదా.

అ॥ రేయంతయు పరతరుణితోడంగూడి మదన తంత్రం
బుల ననుభవించి రేపకడ వచ్చిన మనోహరుంగని తదీయ
సంగమలక్షణంబులు తననెమ్మనమ్మునను మ్మలికంబుఁగూర్చ కో
పగోపనంబుఁగావించి తనపైఁ బతికింగల మక్కువ తెల్లంబగు
నట్లు నెపమిడి మత్రోద్ఘాటనంబుఁ గావించు నాయికావచన చ
మత్కృతి యిందుఁబొందుపఱచియున్నది. (౨౨)

శ్లో॥ ఏతస్మిన్ సహసావసంతసమయే ప్రాణేశ దేశాంతరం
గంతుంత్వంయదిసేతథాపినభయం తావత్ప్రపద్యేధునా।
యస్మాత్కైరవసారగసౌరభముషాసాకంసరోవాయునా
చాన్ద్రీదిక్షువిజృమ్భతేరజనిషుస్వచ్ఛామయూఖచ్ఛటా॥

ఉ॥ ఆమని వేళ నెంతయు రయంబున దూరపుయాత్ర సేయఁ
గా। నీమది నెంచెదట్లయిన నే వెఱవక్క బరితాపవహ్నికిన్। స్వా
మినితాంతము న్గుముదసౌరభమై తగు గాలితోడనీ। సోమమ
యూఖములై దెసలసొంపుగ రేల్గడు పెంపుఁజెందెడిన్.

అ॥ ఇందు నాయకుండు వసంత సమయంబునఁ బరదేశ
యాత్రాగమనోన్ముఖుఁడు కాఁగాఁ గాంచి తద్వియోగంబు
సైరింపఁజాలని నారీమణి తత్ప్రయాణంబు నంగీకరింపకయు
నంగీకరించిన చందంబునఁ బలికినది కవివర్ణించె. (౨౩)

శ్లో॥ చక్షుర్జాడ్యమనైతు మానినిముఖం సన్దర్శయ శ్రోత్రయోః
పీయూషస్రుతిసౌఖ్యమస్తు మధురాం వాచం ప్రియే వ్యాహర।
తాపశ్శామ్యతు మే ప్రసాదశిశిరాం దృష్టిం శనైః పాతయ
త్యక్త్వా దీర్ఘమభూతపూర్వమచిరాద్రోషం సఖేదోషజం॥

ఉ॥ కన్నుల జాడ్యమేగును మొగంబిటు చూపుము శ్రోత్ర
ములుసుధా। త్యున్నత సౌఖ్యమందు నిపుడు గ్గలితీయనిమాట
లాడుమీ। పన్నుగ బోంట్ల బోధనలఁ బాటిలు రోసము నుజ్జ.

గించివే। మిన్నకనాడు తాపము శమింపఁగ శీతలదృష్టిఁజూ
డుమీ.

అ॥ చెలిమిపోలంతులు దనపై నేరము లపారంబుగనారో
పించి చెప్పుటంజేసి మొగమెత్తిచూపక యించుకచూపియుం
బలుకక పలికియు సౌమ్యంబులాడక నాడియు చులుకుచూపు
లఁబఱుపు గరితంగని యెమ్మెకాఁడు వినయమ్మున ననునయిం
చు తెఱం గిందుపన్యస్తనుయ్యె. (౨౮)

శ్లో॥ మానమ్లానమనామనాగపినతంనాలోకతేవల్లభం
నిర్వ్యాతేదయితేనిరంతరమియంబాలాపరంతప్యతే।
ఆనీతేరమణేబలాత్పరిజనైర్ధ్యానంసమాలంబతే
ధత్తేకంఠగతానసూన్ప్రియతమేనిర్గంతుకామేపునః॥

వ॥ మానినితీవ్రరోషగరి మస్ఫినతుం బతిఁజూడ నుద్దదు
నా। ప్రాణవిభుండు పోయిన నిరంతర తాపము నొందునెచ్చె
లు। ల్వానిని దెచ్చి నప్పలిమి వారక మానముఁ బూనుఁగ్రమ్మ

ఉం । బోనతఁ దుష్యమింపనెత బొందిగళంబునఁ దాల్చెఁ బ్రాణముల్.

అ॥ పొలయలుకచేతం గలిగిన సంతాపంబు ప్రబలుతరిఁ బ్రియుండు పెక్కుభంగుల వేడిన నాదరింపక యతండు వెడలి నంతనె మిగుల వగలంబొగులు మగువ తెఱంగు దాని చెలి యొర్తు మఱియొక్క తెఱఁగు బలికినవిధంబభివర్ణితంబయ్యె. ()

శ్లో॥ కర్ణాకర్ణయంతు నమే చకోకిలరుతంతస్యాశ్శ్రుతే భాషితే
చంద్రేలోకరుచిస్తదాననరుచేః ప్రాగేవసందర్శనాత్।
చక్షుర్మీలనమేవతన్నయనయోః గ్రేమ్మృగీణాంవరం
హైమీవల్ల్యపితావదేవలలితాయావన్నసాలక్ష్యతే॥

చ॥ సతివలుకంగఁ గర్ణపరుషంబగుఁ బైకనినాదమీప్రభా।
ప్రతతికిఁ జంద్రునందురుచి భామమొగంబును జూచునంతకే।
వితతమృగాంగనల్పొలఁది వీక్షణసన్నిధిఁ గన్నుమూయుఁబో।
యతులితహేమవల్లియుఁ దదంగముఁ జూడనసుందరంబగుణ.

అ॥ సాటిలేని రూపరేఖావిలాసంబుల సరసులమరుబారింద్రోయు నొకత్తోయజాక్షింజూచి తమకంబుమితిమీరుచుండ నొకవిటుండు దాని సోయగంబు మొదలుగాఁగల గుణంబులఁజెలికానికిం బలుకుచెలువు నిందువర్ణించినాఁడు. (౨౬)

---

క॥ శ్రీముద్దులక్ష్మణ్ణధరి। శ్రీమఘవునివందిభారతీశేషకవి। గ్రామణిశిష్యుండసదృశ। శేముషి శేషాద్రికవిరచించె దీనిఁ॥

---

పుష్పబాణవిలాసము
సంపూర్ణము.

---

శ్రీ.

ఈకవీంద్రుఁడు రచియించిన చంపువిరాటపర్వముపై నిత రులయభిప్రాయంబులు.

——(*) శ్రీయాంధ్రభాషాసంజీవని. (*)——

ఆంధ్ర చంపువిరాటపర్వము. — ఈ పొత్తము కడుఁజిన్నదై నను బూనిపరికింప, సాధుపద వాక్యములచేతను సాధారణ పద్యములచేతను, నర్థసౌలభ్యముచేతను, యథోచిత రసాలంకారాదిగుణములచేతను, జాలఁ గ్రాలుచున్నది. ఈ పొత్తము, రాజా శ్రీ, ముద్దుకృష్ణయాచేంద్రబహాదర్వారియాజ్ఞవలన వేంకటగిరిలో నుండెడు, మ॥ రా॥ రా॥ బిరుదరాజ, శేషాద్రిరాజ కవిగారు రచియించిరి. వీరు రాజ కవిగారుగానే నెగడవలెనని కోరుచున్నారము. తండ్రిగారు రామాయణమును రచింపించిరి. కుమారులు భారతమును రచియింపించిరి. ఇది సముచితము కదా!

పచ్చయప్పకాలేజి తెనుఁగుపండితులగు,
కొం. సుబ్రహ్మణ్యశాస్త్రిలవారు.

———

సీ॥ శ్రీరస్తు; సర్వధాత్రీమండలంబునఁ బ్రథితమైనయనంత

భట్టరచిత । చంపుభారతమను సంస్కృతకావ్యరత్నమునం
దుపష్ఠసప్తమములౌచు । భాసిల్లు రెండు స్తబకములఁ "జంపు
విరాటపర్వమ్ము" నాఁ బ్రథ వెలుంగ । శ్లోకగద్యముల నేకరీతిని
బద్య వచనమ్ములుగఁ గూర్చి ప్రాజ్ఞవితతి । మేలుమేలనఁగఁ దు
మృదుశైలితోడ । భావరసములననుకూలపఱచిబిరుద । రా
జశేషాద్రి రాజువార్పంపినచిన । కోశమెంతయు నలరించెఁ,
గొం. సు. శాస్త్రి॥

( ) వావిలికొలను సుబ్బరాయకవిగారు. ( )

సీ॥ శ్రీమహీంద్రుఁడు ముద్దుకృష్ణయాచేంద్ర బహూకృ
తలలితకళాభిమాన । గుణముమూర్తీభవించెనో నాఁగఁ దనరి
గాదికంబునను శేషాద్రిరాజు । నిజకవితాభ్యాసనిపుణతవెల
యంగ రచియించెఁ జంపువిరాటపర్వ । మొదలి దెనుంగున నో
ప్పు సలక్షణంబై వెలుంగంగ నిత డొనర్చెఁ । బండితావళికిఁ గ
ర్ణపర్వముగను । వరపురోభాగులకు భీష్మపర్వముగను । బా
లకవికను శాసనపర్వముగను । బావరులకును సౌప్తికపర్వ
ముగను॥

దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు తనకుగ్రంథముపంపిన
ఆర్. వెంకటసుబ్బయ్యగారిపేర వ్రాసినది.

ఉ॥ చంపువిరాటపర్వమును సజ్జులుమీరనుకంపఁబంపరా। ఘింపురహింపఁజూచితిగ ఘింపఁదగున్ రసపుష్టిదానన । గ్గింపఁ బనేమిలాఁత్రిపరి కింపఁగరత్నముఖుల్ నుతింపనా । సొంపులు రాజుకేతగుట సూక్తిసుధారసధారచాటెడిన్॥

ఉ॥ ఐననభిజ్ఞులీరడుగ నారసియుత్తరమీక యుంట యె। గ్గానటుగానఁబద్దమునొకండిదెయర్పణసేసినాఁడనా । పైనెన రుంచితత్కవికిఁ బంపుఁడుదీని విశేషమేల? వి । ద్యానిధులెల్ల రాజుకవితంగన సంతసమందకుందురే॥

శా॥ 'కంటింజంపువిరాటపర్వముగుణాఖర్వంబుఖర్వం బువే । గంటింముద్రతితీత్కవిత్వమహిమం గన్గొంటివేడ్కొం టిము । క్కంటింబల్కరుఁదత్కవీశ్వరునకుం గల్యాణముల్ రా చవేఁ । గంటింబోలఁగవైభవంబులు నొసంగన్ నిత్యహర్షం బునన్'॥

## (*) జ్ఞానోదయము. (*)

చంపువిరాటపర్వము ఆంధ్రము.—ఈ గ్రంథము వెంకటగిరిసంస్థానాస్థానకవీంద్రులగు బిరుదరాజ శేషాద్రిరాజుగారిచే, శ్రీవెలుగోటి ముద్దుకృష్ణయాచేంద్రులవారి ప్రేరణంబున రచింపఁబడెను. ఇయ్యది సంస్కృత చంపుభారతంబునుండి యథాశ్లోకంబుగ నాంధ్రీకరింపఁబడినది. ఈగ్రంథశైలిమిగులరమ్యమైనది. మాకు తెలిసినవరకు నిట్లు గవిత్వము చెప్పువారు లెక్కకు మిక్కిలితక్కువగనున్నారు.

## (*) దేశోపకారి. (*)

శ్రీమద్దిగంతరలసత్కీర్తి విస్ఫూర్తి విభాసురానంత భట్టకృత సంస్కృత చంపుభారతాంతర్గత షష్ఠసప్తమ స్తబకద్వయంబు శ్రీమదనంతధైర్యస్థైర్యగాంభీర్య చాతుర్యౌదార్యచర్యులును శ్రీసర్వజ్ఞ కుమారయాచ మహీమండలాఖండల కుమారవర్యులును, జనావనధుర్యులునగు శ్రీముద్దుకృష్ణయాచేంద్రచంద్రులప్రేరణంబునఁ దదాస్థాన కవీంద్రుండును ఉభయభాషాభూషణుండు నగు బిరుదరాజ శేషాద్రిరాజుగారిచే యథాశ్లోకంబుగఁ దెనుగింపఁబడి సకల సుకవి కౌతుకదాయం

హై చంపువిరాటపర్వనామంబున విరాజిలు పద్యకావ్య మొ కటి మా కార్యస్థాన మలంకరించినది.

గ్రంథాదిని గ్రంథకర్తలు పై విధమున వ్రాసిన విన్నపమువల నసే తద్గ్రంథకర్తలయొక్క దార్ఢ్యము వెల్లడి యగుచున్నయ ది. అయిన వస్మత్పత్రికాపాఠకులే తత్కవికృతమగు మధుర శైలినిఁగూర్చి యానందించుటకనువగునటుల తద్గ్రంథములో ని రెండుపద్యము లీదిగువనుదహరించుచున్నాము.

ఈ క్రింది పద్యము కీచకునితో సైరంధ్రివేషమున నున్న పాంచాలిచెప్పినది.

చ॥ అనఘుతరావరోధ జలజాక్షులఁబొందెదు నీవునన్నునీ। యనువున నీచజాతిమలినాంగిని గోరుటనింద్యమయ్యెనె। మ్మ నము చెలంగఁగల్పసుమ మంజరులన్విహరించుబంభరం। బెన యత్నానసంగతమ హీరుహానల్లరిగోర్కినించునే॥

ఉ॥ వేలుపుటేఱుఁదెల్లగను వేఁడివెలుంగు కుమారి నల్ల గాఁ। జాలగనా సరస్వతిఁబి రంగరుచిర రచియించి కంజజుం। బోలిని గెంపుచాయసిడి నొక్కటిఁజేయఁడఁటంచు నర్జునుం। పాలమునం స్పృజ్ఞదులనంతములంబఱపెన్నరంబులన్॥

